దనర నంగవం క్తిఁ దగునట్లువ్రాయంగ
ధర్మసాంద్ర శ్రీ సదాశివేంద్ర. 3

వ॥ సంఖ్యాలక్షణంబెట్టిదనిన —

సీ॥ అంత్యముపాంత్యతుర్యములు షష్ఠంబును
సంఖ్యజేసిన విప్రజాతిసంఖ్య
యంత్యముపాంత్యషడర్కపర్వమ్ములు
సంఖ్యఁగూర్చిన రాజజాతిసంఖ్య,
యనువొంద నంత్యముపాంత్యమునీంద్రమూ
ర్ఛనలుఁగూర్చిన వైశ్యజాతిసంఖ్య,
యంత్యముపాంత్యశరావతారతిథులు
జతఁగూర్చినను శూద్రజాతిసంఖ్య,

గీ॥ యించుకంత్యముపాంత్యవిరించిపర్వ
భములు సంఖ్యకు సంకీర్ణకమున నిట్టి
యంగకశ్రేణిసంఖ్యలకు నిత్య
మాశఁగూర్పుము మొదట సదాశివేంద్ర. 4

కం॥ అంగశ్రేణులుమీఁదట
శృంగారంబుగ లిఖించి చెలువుగఁగ్రిందన్
బొంగుచు సంఖ్యలుఁగూర్చిన
రంగగును సదాశివేంద్ర రాజసురేంద్రా. 5

— ॥ పాతాళసంఖ్య ॥ —

గీ॥ అంత్యమంత్యోపరిగ్రహముపాంత్యమాదిఁ
గాఁగఁదజ్జాతిసంఖ్యప్రకారమునను
సంఖ్యఁగూర్పంగఁబాతాళసంఖ్య మొదటఁ
దెలఁగు నూర్ధ్వాళి శ్రీసదాశివమహీశ. 6

కం॥ అనయంబంతో ర్ధ్వార్ధ్వాళయ
మనువుగఁ బా తాళసంఖ్యక మరింపఁదగుఁ గా
గని(వ్రాయు మీఁదలఘువునే
తనదగు మహాదాశ శ్రీసదాశివధీరా.

వ॥ అంగ శ్రేణిసంఖ్యాదిఫలలక్షణం బెట్టిదనిన —

సీ॥ అంగపంక్తులక్రిందనమరిన సంఖ్యలుఁ
గనియామహాత్తుకంగంబులునిలిచి,
ప్రస్తరించిననెన్ని భవ్యతాళంబులుఁ
గల్గె నటన్న సంఖ్యాకుఫలంబు,
ప్రస్తారములుఁజూచి బ్రాహ్మణకులమైన
ద్రుతలఘుగురువులు ప్లుతములిన్ని

గీ॥ యిన్ని యితరకులమైన నిన్నిద్రుతలు
యనుద్రుతలు నిన్ని యంచును నమరుచుండు
లఘుగురుప్లుతలిన్ని లీలల మెలంగు
ననుచు నాయాయిజాతిక్రమంబు
చేతఁ బా తాళసంఖ్యరంజితఫలంబుఁ
జెప్పుము చెరుకూరి సదాశివనృపాల. * 8

— ॥ ఇచ్ఛాపా తాళలక్షణము ॥ —

సీ॥ అళాంత్య మొక్కటి యాదినిలిఖియించి
వెండియంత్య మొకటి వేసిమఱియు,
నాయాయిజాతి సంఖ్యాక్రమంబులసంఖ్యఁ
దగఁగూర్ప నిష్టపా తాళసంఖ్యఁ

* ఈ సీసపద్యమందు సీసపాదములు మూఁడే కన్పించుచున్నవి. గీతిపాదములు మాత్రము ఆఱు కన్పించుచున్నది. గీతిపాదములాఱింటిలోను మొదటి రెండు పాదములు మాతృకలో నీ క్రిందివిధముగాఁగన్పడుచున్నవి. "యిన్నియుంచు నితరకులములైన, నిన్నియును ద్రుతినిద్రుతలు"

యిన్నిద్రుతాంతము లిన్నిలఘ్వంతము
లిన్నిగుర్వంతము లిన్నిప్లుతము
లున్న యంత్యములంచునురుజాతిసంఖ్యల
విప్రజాతికినెంచి వేఱుజాతి

గీ॥ కతులితానుద్రుతాంతద్రుతాంతలఘుయు
తాంతగుర్వంతరమ్యప్లుతాంతతాళ
చయము లిన్నిన్నియనిపల్కఁజతురులగుచు
దావిఫలములు తెలియు సదాశివేంద్ర. * 9

— ॥ సర్వపాతాళలక్షణము ॥ —

గీ॥ జాతిసంఖ్యాక్రమంబున సకలజాతి
కలితపాతాళసంఖ్యలేకంబుగాఁగ
హెళిఁజేర్చిన సర్వపాతాళఫలము
లవఘణించును శ్రీసదాశివనృపాల. 10

వ॥ మఱియుఁదాళప్రస్తారంబు నేయు తెఱంగెఱుంగించెద. ఆప్రస్తారంబు నిజప్రస్తారంబనియును, ఖండప్రస్తారంబనియును రెండు విధంబులై యుండు. అందు మొదటిప్రస్తారంబు నిరూపించి పిమ్మట ఖండప్రస్తారంబు వివరించెద. అదియటుండనిమ్ము. ఆ మొదటి నిజప్రస్తారంబన్నది చతురశ్రత్ర్యశ్రాదిపంచజాతిభేదంబులచేత

---

* ఈ సీసపద్యములోని గీతియొక్క మొదటి రెండుపాదములు మాతృకలో దుర్గ్రాహ్యభాగయుక్తమై యీక్రిందిరీతిని కానబడుచున్నది. "కతులితాను ద్రుతాంతలఘుయుతాంతగుర్వంతరమ్యప్లుతాంతతాళ". పై సీసపద్యమునందుఁ జతురశ్రజాతికంగంబులైన ద్రుతలఘుగురుప్లుతంబులప్రసక్తిఁ దెచ్చి తదితరజాతికి నంగంబులైన అనుద్రుతద్రుతలఘు గురుప్లుతంబులను ఐదింటిని చెప్పవలసిన యీగీతిపాదములయందు రెండవయంగమైన "ద్రుతంబును" వదలి యితరాంగములను మాత్రము చెప్పుటచే నీయపపాఠ మేర్పడినది. వ్రాయసగాని ప్రమాదికముచేఁ గాఁబోలు విలుప్తమైన "ద్రుతాంత" యనుశబ్దమును చేర్చుటచే పై రీతిగఁ బాఠము సవరింపఁబడినది.

పంచవిధంబై యుండు. మఱియు బ్రాహ్మణక్షత్రియాదిజాతులలోన క్షత్రియాదిజాతులకంటెను బ్రాహ్మణజాతి శ్రేష్ఠంబై నిర్మలంబై యుండుకరణిఁ జతురశ్రాదిజాతులలోను ద్వ్యశ్రాదిజాతులకంటెను జతురశ్రజాతి భిన్నలక్షణంబై శేఖరంబై చల్లదనంబునన్వాలయు, క్షత్రియాదిజాతీయజనులకన్నను బ్రాహ్మణజాతీయజనుండు బ్రహ్మచర్యాద్యాశ్రమచతుష్టయంబుచేత గరిష్ఠుండై తనరునట్లు త్ర్యశ్రజాతీయాదిప్రస్తారంబులకంటె భిన్నప్రకారంబై ద్రుతాదిచతురంగసమేతంబై చతురశ్రజాతీయప్రస్తారంబు సుకరంబై విలసిల్లు. చతురశ్రప్రస్తారంబు చతురంగసమేతంబనియును జతురశ్రజాతియందు ద్రుతాదిచతు రంగంబులేకాని యితరాంగంబు చేరదనియును బల్కుటకు వ్యవహారసాధనంబెద్దియనినఁ జతురశ్రంబనియెడు విప్రజాతి నామధేయంబే జ్ఞాపకంబై తత్సాధనంబై విలసిల్లు. అది యెట్లన్నఁ జతురశ్రంబన్న చోటనశ్రంబని యంగంబునకు నామధేయంబై యొప్పుఁ గావునఁ జతురంగంబులఁగలది చతురశ్రంబని చతురశ్రజాతికి నామధేయంబయ్యెనని చతురశ్రశబ్దంబునకుఁ జతురంగప్రాధాన్యవ్యవహారద్యోతనసామర్థ్యంబుఁగలదని తెలియవలయు. అదియట్లుండ మఱియు వైశ్యాదిజాతులకంటె క్షత్రియజాతి యుత్తమంబైనకరణిఁ ద్వ్యశ్రాదిజాతులలోను మిశ్రాదిజాతులకంటెను ద్వ్యశ్రజాతి యధికంబై తనరుచుండు. అట్టి క్షత్రియజాతిపురుషుండు వైశ్యజాతీయాదిపురుషులకంటె నలబ్ధసంపాదనవిపత్తిప్రతీకారపురుషద్రవ్యసంపత్తిదేశకాలవిభాగకార్యసిద్ధులనియెడు పంచాంగంబులచేతఁ బ్రబలుండైనట్లు మిశ్రాదిజాతులప్రస్తారంబులకంటెను ద్వ్యశ్రజాతీయప్రస్తారంబు ద్రుతాదిపంచాంగసమేతంబై శేఖరంబై యొప్పు. చతురంగంబులు రాజులకు విహితంబులు కాని యన్యులకెట్లన్నఁ బంచాంగచతురంగంబులోనఁ బంచాంగంబులు క్షత్రియునకుత్తమకరణంబులై వెలసియుండు, నదియెట్లన్నఁ జతురంగంబులు పంచాంగంబులచేతఁగాని కలుగనేరదను నెపంబునం జేసి చతురంగపంచాంగంబులలోనఁ జతురంగంబు నంగంబై

యప్రధానంబునై పంచాంగంబునంగియై ప్రధానంబునై విలసిల్లు. అదియెట్లన్న నంగంబైన చతురంగంబు బహిరంగంబును నంగియైన పంచాంగంబంతరంగంబై తేజరిల్లుఁగావున "అంతరంగబహిరంగ యోరంతరంగం బలీయః" అను న్యాయవచనంబుగలుగుటంజేసి పంచాంగంబులే రాజులకవశ్యసంగ్రాహ్యంబులై యుత్తమంబులైనట్లు యనుద్రుతాదిపంచాంగకంబులులేక ద్రుతాదిచతురంగంబులు కలుగవుకావునఁ జతురంగంబుకంటె బంచాంగంబులునైయుండునని క్షత్రియజాతికిఁ[1] బంచాంగప్రాధాన్యంబును జతురశ్రజాతికిఁజతురంగప్రాధాన్యంబును సిద్ధంబైయుండు. చతురంగంబులు ద్రుతాదికంబులుగానున్నను ననుద్రుతాదికంబులుగారావో కాయని శంకింపఁదగదు. అందులకు లోకవ్యవహారంబే సాధనంబని తెలియఁదగు. అదియునుంగాక రాజార్హంబులైన పంచాంగంబులు వైశ్యజాతీయపురుషులకెట్లమరుననిన "యథా రాజాతథా ప్రజాః" అనున్యాయంబుచేత రాజాజ్ఞకులోనైన జనులకందఱికిని రాజకీయాచారంబవశ్యకర్తవ్యంబుగావున సకలజాతిజనులకును నలబ్ధసంపాదనాది రాజపంచాంగంబులవశ్యంబుగావలసియుండునట్లు మిశ్రాదిజాతులు త్ర్యశ్రానురోధంబుగాఁ బ్రవర్తిల్లుటంజేసి తదనుద్రుతాదిపంచాంగంబులు మిశ్రాదిజాతులకును గలిగియుండుఁగావున మిశ్రాదిప్రస్తారంబులును ద్ర్యశ్రానుగుణంబుగాఁబంచాంగప్రధానంబులై యొప్పుచుండు. ఇట్లు చతురంగపంచాంగభేదంబులచేత రెండు విధంబులైన యీనిజప్రస్తారంబు తత్తజ్జాతీయమాత్రాదిభేదంబులవలన బహువిధంబైయుండు. తత్ప్రపంచంబెట్లన్న, ఆచతురంగపంచాంగప్రస్తారంబులలోనఁ జతురంగప్రస్తారంబు ఏకమాత్రప్రస్తారంబనియును, ద్విమాత్రప్రస్తాంబనియును, త్రిమాత్రప్రస్తారంబనియును, మొదటఁద్రివిధంబయ్యెను. ఏకార్ధమాత్రప్రస్తారంబనియును, ద్వ్యర్ధమాత్రప్రస్తారంబనియును, త్ర్యర్ధమాత్రప్రస్తారంబనియును, చతుర్మాత్రప్రస్తారంబనియును చతురర్ధమాత్రప్రస్తారంబని

(1) క్షత్రియజాతియన నిచట త్ర్యక్షరజాతియనియర్థము.

యును, పంచమాత్ర పంచార్ధమాత్రి,షణ్మాత్రి షడర్ధమాత్రిప్రస్తారంబులనియేడు నివ్విధంబున నంగశ్రేణిప్రకారంబు బహువిధంబై చెల్లుచుండు. మఱియు పంచాంగప్రస్తారంబు త్ర్యశ్రాది జాతిభేదంబులచేతను నాలుగు విధంబులయ్యెను. అర్ధమాత్రిప్రస్తార, ఏకమాత్రిప్రస్తార, ద్విమాత్రిప్రస్తార, త్రిమాత్రప్రస్తారంబులనుచు నొక్కొక్కజాతికి నాల్గువిధంబులగుటంజేసి నాల్గుజాతులయందును ఏదునాఱుప్రస్తారంబులుఁగలిగియుండు. చతురంగప్రస్తారంబులు మూఁటితోఁగూడ నిజప్రస్తారంబు యేకోనవింశతిభేదంబులం బ్రవర్తిల్లు. అందు మఱియు త్ర్యశ్రాదిజాతీయపంచాంగప్రస్తారంబులలో నక్షరకాలభేదంబున నన్నియు నన్నివిధంబులై యుండు. ఎట్లన్న నందులో మొదటత్ర్యశ్రప్రస్తారంబులో నర్ధమాత్రప్రస్తారంబును, అర్ధపాదమాత్రప్రస్తారంబును, అర్ధార్ధమాత్రప్రస్తారంబును, అర్ధార్ధపాదమాత్రప్రస్తారంబును, ఏకమాత్రప్రస్తారంబును, ఏకపాదమాత్రప్రస్తారంబును, ఏకార్ధమాత్రప్రస్తాతంబును, ఏకార్ధపాదమాత్రప్రస్తారంబును, ఏకార్ధార్ధమాత్రప్రస్తారంబును, ఏకార్ధార్ధపాదమాత్రప్రస్తారంబును, ద్విమాత్రప్రస్తారంబును, ద్విపాదమాత్రప్రస్తారంబును, ద్వ్యర్ధమాత్రప్రస్తారంబును, ద్వ్యర్ధపాదమాత్రప్రస్తారంబును, ద్వ్యర్ధార్ధమాత్రప్రస్తారంబును, ద్వ్యర్ధార్ధపాదమాత్రప్రస్తారంబును, త్రిమాత్రప్రస్తారంబును, త్రిపాదమాత్రప్రస్తారంబును, త్ర్యర్ధమాత్రప్రస్తారంబును, త్ర్యర్ధపాదమాత్రప్రస్తారంబును, త్ర్యర్ధార్ధమాత్రప్రస్తారంబును, త్ర్యర్ధార్ధపాదమాత్రప్రస్తారంబును, చతుర్మాత్రిప్రస్తారంబనియును, అనుద్రుతేతోత్తరంబై నయంగశ్రేణిప్రకారంబునఁద్ర్యశ్రప్రస్తారంబనేకవిధంబైయుండు మిశ్రప్రస్తారంబన్నది, అర్ధమాత్రిప్రస్తారంబనియును, అర్ధపాదమాత్రిప్రస్తారంబనియును, అర్ధార్ధమాత్రిప్రస్తారంబనియును, అర్ధార్ధపాదమాత్రిప్రస్తారంబనియును, అర్ధత్రియమాత్రిప్రస్తారంబనియును, ఏకమాత్రిప్రస్తారంబనియును, ఏకపాదమాత్రిప్రస్తారంబనియును, ఏకార్ధమాత్రిప్రస్తారంబనియును, ఏకార్ధపాదమాత్రిప్రస్తారంబనియును, ఏకార్ధార్ధమాత్రిప్రస్తారంబనియును, ఏకార్ధత్రి[illegible]

మాత్రప్రస్తారంబనియును, ద్విమాత్రప్రస్తారంబనియు ననుచుఁ ద్ర్యశ్రంబునుంబోలె మిశ్రప్రస్తారంబనేక విధంబై యుండు.

ఖండజాతిప్రస్తారంబన్నది, అర్ధమాత్రప్రస్తారంబనియును, అర్ధపాదమాత్రప్రస్తారంబనియును, అర్ధద్వయమాత్రప్రస్తారంబనియును, ఏకమాత్రప్రస్తారంబనియును, ఏకపాదమాత్రప్రస్తారంబనియును, ఏకార్ధమాత్రప్రస్తారంబనియును, ఏకార్ధపాదమాత్రప్రస్తారంబనియును, ఏకార్ధద్వయమాత్రప్రస్తారంబనియును, ద్విమాత్రప్రస్తారంబనియును, ద్విపాదమాత్రప్రస్తారంబనియు నిత్తెఱంగున ఖండజాతిప్రస్తారంబు మిశ్రజాతిప్రస్తారంబునుంబోలె బహువిధంబై యుండు.

మఱియు సంకీర్ణప్రస్తారంబన్నది, అర్ధమాత్రప్రస్తారంబనియును, అర్ధపాదమాత్రప్రస్తారంబనియును, అర్ధద్వయమాత్రప్రస్తారంబనియును, అర్ధద్వయపాదమాత్రప్రస్తారంబనియును, అర్ధత్రయమాత్రప్రస్తారంబనియును, అర్ధత్రయపాదమాత్రప్రస్తారంబనియును, అర్ధచతుష్టయమాత్రప్రస్తారంబనియును, ఏకమాత్ర ప్రస్తారంబనియును, ఏకపాదమాత్రప్రస్తారంబనియును నీక్రమంబున సంకీర్ణప్రస్తారంబు ఖండప్రస్తారంబునుంబోలె బహువిధంబై యుండు. ఇట్లు చతుర్విధంబులైన పంచాంగప్రస్తారంబులు కాలభేదంబున భిన్నభిన్నప్రకారంబులై యన్నియు నన్నివిధంబులై యొప్పుచుండు. ఇదియునుంగాక త్ర్యశ్రాదిజాతులయందుఁగల్గు ప్రస్తారంబులలో ననుద్రుతపెఱ(1) ప్రస్తారంబేల లేదన్న ననుద్రుతంబునకుఁ గ్రిందిభేద్యంబైన యల్పాంగంబు త్ర్యశ్రాదులయందు లేదుగాన నాజాతుల లోనఁ బాదమాత్ర ప్రస్తారంబు లేదయ్యె. (2)విప్రజాతియందుఁగల్గు ప్రస్తారంబులలో ద్రుతపెఱప్రస్తారంబేల లేదన్న నాజాతియందు

---

(1) అనుద్రుతమనఁగా తక్కినయంగములుగల ప్రస్తారంబని యర్థము.

(2) చతురశ్ర జాతియని యర్థము.

ద్రుతంబునకుఁ గ్రిందియల్పాంగంబుగాని దానికంటె నల్పాంగంబు గాని లేదుగాన ద్రుతమునకుం గ్రిందిభేద్యంబైన యంగంబు లేదయ్యె. అట్లుగావున తజ్జాతీయార్ధమాత్రద్రుతప్రస్తారంబు లేదని తెలియవలయు.

ఇట్లు బహుప్రకారంబైన ప్రస్తారంబునకుఁ గార్యంబేమియనినఁ బంచజాతీయంబులైన తాళంబులనంతంబులుగావున నిన్నిమాత్రల మహాత్తులిఖించి ప్రస్తరించిన నెన్నితాళంబులు పుట్టుననియెడి తాళ సంఖ్యాజ్ఞానంబు ప్రస్తారంబునఁగాని గలుగనేరదుగావున నట్టి ప్రస్తారంబుసేయు నేర్పేర్పఱించెద నాకర్ణింపుము —

సీ॥ ఏ జాతిలోనైన నెసగప్రస్తారయో
గ్యంబులైనట్టి యంగములునిలిపి
యందులో భేదింపనైన యంగముక్రింద
నల్పాంగము ఘటించియందు శేష
మక్షరకాలక్రమానురూపంబుగా
నొగిమహాత్తొనరించ యోగ్యమైనఁ
యొనరించి తద్వామముననిల్పి తచ్ఛేష
మబ్బెనా యట్లుమహాత్తుకేయ,

గీ॥ దగినఁగావించియదియును దానిశేష
మధికమల్పాంగకమనుచు నాకుడినినె
డమను నిడి యథాంగము యథాంగముఁవ్రాయఁ
దగును బ్రస్తారములను సదాశివేంద్ర. 11

గీ॥ ఇటుల సర్వద్రుతాంత స్ఫుటములగుచు
విప్రజాతిని ప్రస్తారవిధములమరు
నట్లువెలయుసర్వాంతము నన్ద్రుతాంత
మగు నితరప్రస్తారములు సదాశివేంద్ర. 12

గీ॥ అగ్రజాతికినల్పాంగ మగుద్రుతంబె
యితరజాతులకల్పాంగ మీయనుద్రు
తంబె యవిదక్క నల్పాంగకంబులేదు
తలఁపఁబ్రస్తారములను సదాశివేంద్ర. 13

వ॥ ప్రస్తారంబునకు సులభంబుగా నొక్కవిశేషంబెఱుంగించెద, నది యెట్టిదనిన—

సీ॥ చతురశ్రజాతీయచారులఘువుక్రింద
ద్రుతములురెండు పొందుగఘటిల్లుఁ
ద్ర్యశ్రజాతీయమౌ తగలఘువుకుఁగ్రింద
మూఁడుద్రుతంబులు మొనసియుండు
మిశ్రజాతీయసమ్మితలఘువుకునిల్చు
ద్రుతములు మూఁడనుద్రుత మొకటియు
ఖండజాతినిగల్గు ఘనలఘువుకుఁగల్గు
ద్రుతములురెండునుద్రుత మొకండు

గీ॥ లలితసంకీర్ణజాతీయలఘువుక్రింద
ద్రుతములొకనాలుగొకయను ద్రుతమునిల్చు
ననుచుఁబ్రస్తారములు సేయునవసరములఁ
దజ్ఞులాడుదురయ్య సదాశివేంద్ర. 14

వ॥ ఇట్లు నిజప్రస్తారంబు సవిస్తరముగావివరించి యింకఁ (1) దద్భేదంబైన ఖండప్రస్తారంబు సప్రపంచంబుగా నిరూపించెద. అది యెట్టిదనిన నాఖండప్రస్తారంబిన్ని మాత్రలనిజప్రస్తారంబులోన నిట్టియంగంబులేని తాళంబు లెన్నియనియు నిన్నిన్నియంగంబులతోఁ గూడినతాళంబు లెన్నెన్నియనియు నుద్దేశించి ప్రత్యేకంబును సకలప్రస్తారంబులయందును ఖండఖండంబులుగానెత్తి ప్రస్తరించుటంజేసిఖండప్రస్తారంబను నామధేయంబునంబరగె. అట్టి ఖండప్రస్తారంబు హీన

(1) దద్భిన్నమైన యని సాధుపాఠము.

ప్రస్తారంబనియును, యుక్తప్రస్తారంబనియును రెండువిధంబులై వర్తిల్లు. అందు హీనప్రస్తారయుక్తప్రస్తారంబులు చతురంగపంచాంగభేదం బున మఱియు నిరువెలుంగై యుండు, నందు జతురంగహీన (1) ప్రస్తా రంబు సర్వద్రుతాంతంబనియును నుద్దిష్టాదికసర్వద్రుతాంబనియును ద్వివిధంబై యుండు. పంచాంగహీనప్రస్తారయుక్తప్రస్తారంబులు సర్వానుద్రుతాంతంబులనియును నుద్దిష్టాదికసర్వానుద్రుతాంతంబని యును రెండుహారువులంబ్రబవర్తిల్లు. అట్టి ఖండప్రస్తారంబునకు నిజ ప్రస్తారంబునకుంబోలె జాతిమాత్రాదిభేదంబులచేత నెన్నెన్నిభేదం బులుతోఁచునో యన్నన్నిభేదంబులుఁగల్గియుండు. మరినిజప్రస్తారము నకుంబోలె ప్రస్తారవిధానంబు ఖండంబునకు సమానంబైనను దాని కంటె యంత్రాద్యనుసరణాదివిశేషంబులు ఖండప్రస్తారప్రధానం బులై వింతవింతలుగాఁ గొన్ని దీనికిఁగలుగుటంజేసి యివి ప్రత్యేకం బుగా వివరించవలసియుండె. తల్లక్షణం బెఱుంగించెద నాకర్ణింపుము-

కం॥ ఎన్నెన్నియగునుయంత్రము
లన్నన్నివిధాలచేతసమరుచునుండుఁ
బన్నుగఖండప్రస్తా
రోన్నతవిభవము సదాశివోర్వీనాథా. 15

కం॥ ఇరునాలుగువిధములచేఁ
బరగినప్రస్తారఖండబాహుళ్యము దా
మరిప్రతియంత్రము వేర్వే
రరయ నొకొటొకటి సదాశివా బహువిధముల్. 16

వ॥ అది యెట్టిదనిన ఖండప్రస్తారంబు యంత్రభేదంబులచేత బహువిధంబైన తెఱంగెఱుంగించెద. అట్లు ప్రసిద్ధంబులైన చతురశ్రత్ర్య

---

(1) చతురంగయుక్తప్రస్తారంబు మాతృకలోఁ జెప్పఁబడలేదు.

శ్రాది పంచజాతీయయంత్రంబు లిరువదినాలుగింటిలోన మొదటని
రూఢంబులగు చతురశ్రయంత్రంబులు నాలుగింటిలోన మొదటిద్రుత
యంత్రంబునందు విషమ సమకోష్ఠానురోధంబుగా యంత్రంబు ఫలంబు
లొనంగుచుఁ బ్రత్యేకించి ఖండఖండంబుగా నుద్దేశించుచు విభజించుటం
జేసి ద్రుతహీనతాళప్రస్తారంబనియును, ఏకద్రుతయుక్తతాళప్రస్తా
రంబనియును, ద్రుతద్వయయుక్తతాళప్రస్తారంబనియును, ద్రుత
త్రయయుక్తతాళప్రస్తారంబనియును, చతుర్ద్రుతయుక్తతాళప్రస్తారం
బనియును, పంచద్రుతయుక్తతాళప్రస్తారంబనియును, షడ్ద్రుతయుక్త
తాళప్రస్తారంబనియును, సప్తద్రుతయుక్తతాళప్రస్తారంబనియును,
ద్రుతాష్టకయుక్తతాళప్రస్తారంబనియును, నవద్రుతయుక్తతాళప్రస్తారం
బనియునిట్లుబహుభంగులంబ్రవర్తిల్లు. మఱియులఘ్వాదియంత్రంబుల
మూఁటియందును గ్రమంబుతోడ లఘుహీనప్రస్తారంబనియును, గురు
హీనప్రస్తారంబనియును, ప్లుతహీనప్రస్తారంబనియును,ఏకలఘుయుక్త
ప్రస్తారంబనియును, ఏకగురుయుక్తప్రస్తారంబనియును, ఏకప్లుతయుక్తప్ర
స్తారంబనియును, ద్విలఘుయుక్తప్రస్తారంబనియును, ద్విగురుయుక్తప్ర
స్తారంబనియును, ప్లుతద్వయయుక్తప్రస్తారంబనియును, త్రిలఘుయుక్త
ప్రస్తారంబనియును, త్రిగురుయుక్తప్రస్తారంబనియును, ప్లుతత్రయ
యుక్తప్రస్తారంబనియును, చతుర్లఘుయుక్తప్రస్తారంబనియును, చతు
ర్గురుయుక్తప్రస్తారంబనియును, ప్లుతచతుష్టయయుక్తతాళప్రస్తారంబ
నియు నిట్లు చతురంగఖండప్రస్తారంబనేకవిధంబై విలసిల్లు. ఇవ్విధం
బున నితరక్షత్రియాది (1) జాతీయయంత్రములలోన జాతిచతుష్టయ
మునకు సాధారణంబైన యనుద్రుతయంత్రంబునందు సబిందునిర్బిందు
స్థానానుగుణంబుగా యంత్రఫలంబుఁ జూచి నిర్దేశించుటం జేసి యను
ద్రుతయుక్తప్రస్తారంబును యనుద్రుతహీనప్రస్తారంబును తత్తత్తాళ
సంఖ్యాయుక్తంబులై యనుద్రుతయంత్రంబులైన ఖండప్రస్తారంబు
లనేకవిధంబులై యుండు. తక్కిన ద్రుతాదియంత్రంబులు నాల్గింటి

---

(1) క్షత్రియాది యనఁ జతురశ్రాది యని యర్థము.

యందును యంత్రఫలానురోధనంబుగా నిర్దేశించుటంజేసి క్రమంబుగా ద్రుతహీన, లఘుహీన, గురుహీన, ప్లుతహీన తాళప్రస్తారంబులనియు, ఏకద్రుతయుక్త, ఏకలఘుయుక్త, ఏకగురుయుక్త, ఏకప్లుతయుక్తతాళప్రస్తారంబులనియును, ద్రుతద్వయద్రుతత్రయ ద్రుతచతుష్టయ ద్రుతపంచయుక్తతాళప్రస్తారంబులనియును, ద్విలఘు త్రిలఘు చతుర్లఘు పంచలఘుయుక్తతాళప్రస్తారంబులనియును, ద్విగురు త్రిగురు చతుర్గురు పంచగురుయుక్తతాళప్రస్తారంబులనియును, ద్విప్లుత త్రిప్లుత చతుఃప్లుత పంచప్లుతయుక్తతాళప్రస్తారంబులనియు నివ్విధంబున నేకోత్తరవృద్ధిగా నాయాయియంత్రంబులయందు వింతవింతలుగా ఖండప్రస్తారంబులు బహుప్రకారంబులై ప్రవర్తిల్లు. ఇట్టిఖండప్రస్తారంబు నిజప్రస్తారంబుకంటెఁ బ్రస్తరించుటయందు విశేషంబుగలుగుటంజేసి వేరుగఁ దల్లక్షణంబు వివరించెద నాకర్ణింపుము.

సీ॥ మాత్రలనియమమే మరకనే పట్టున
మొదట నెత్తిన తాళమును లిఖించి
యేయంత్రమాయంత్ర మెడపకఁ జేబట్టి
యాయంత్రమునఁ గూర్చినట్టి సంఖ్య
వెంబడి విడువక విప్రాదిజాతికిఁ
దద్రుతాను ద్రుతాంతాదినియతి
కుద్దేశవిధమున కొఱపాటులులేక
యుండఁ బ్రస్తారముఁ జుపమతోడఁ

గీ॥ కూర్చినత్తరి గొప్పలు కుఱుచలనుచు
నంగనియమంబులొకచోట నమరు నమర
నది యెఱుంగుచు జాగ్రత వదలకెపుడుఁ
దక్షులది కూర్తురయ్య సదాశివేంద్ర. 17

సీ॥ ప్లుతముఖంబులక్రింద ద్రుతమైనలఘువైన
గురువైన నిల్పు నెగ్గరయవలదు

గురువొక్కచోట నాల్గు ద్రుతములునిల్చు
మూఁడు లఘువులొచోఁ బ్లుతము నిల్చు
లఘుయుగ మొకచో మెలఁగు గురునకుఁగ్రింద
నొకలఘువును ద్రుతయుగళమమరు
నెడమను భేద్యాంగ మిట్లుండఁగుడినున్న
భేద్యాంగ మేద్రైనఁ బెంచుకొనుచు

గీ॥ నేమ మెడలక ఖండంపునియతినిట్లు
బ్రస్తరింపఁగ నధికమల్పంబుతోటి
రీతిఁగుడియెడమల నిల్చునీతిమాత్ర
మందు విలసిల్లును రహీనదాశివేంద్ర. 18

కం॥ ఈగతి ఖండప్రస్తా
రాగోచరమహిమ లితరమగుజాతులకుఁ
భాగింప నదియనుద్రుత
భాగురమగు సదాశివేంద్ర భాకరభాగా. 19

వ॥ ఇట్టి దాళప్రస్తారంబులు పారావారంబులభంగి నపారంబులై వెలయు, నట్టి పారావారాంబుల పారంబులఁగనఁదలంచి మహానటపుత్రుండైన హేరంబుండు ప్రస్తరించి తత్తత్తాళప్రస్తారపారావారపారంబులిప్పటికింగననేరక యుండు నని పెద్దలాడుట నిజంబుగావున నట్టిప్రస్తారంబులంబ్రస్తరించి మనుష్యులెట్లు పారంబుఁ గాంతురు. కావున నిట్లు బ్రస్తరింపంజెప్పిన యుపాయంబుచేతఁ గుశాగ్రబుద్ధియైన పురుషుండు నేర్పరియై కుశలుండై కొన్నిప్రస్తారంబులు కావలసినయంత ప్రస్తరించుకొని తౌర్యత్రికవ్యవహారార్థంబుగాఁ దాళంబులగ్రహించుకొని వ్యవహరింపఁ దగునని చతురులైన విద్వన్నటమణులంగీకరింతురిది నిజంబు, నీచిత్తంబున నవధరింపుము. ఇంకనష్టోద్దిష్టప్రకారంబెఱుంగించెద. తత్ప్రకారంబెట్టిదనిన, ప్రస్తారంబుఁ జేసిన నిన్నిమాత్రల తాళప్రస్తారంబులలోన నిన్నవ

తాళంబెట్టిదని యడిగినఁ దన్నష్టతాళాంగంబుల సంకీర్ణసంఖ్యాక్రమంబుఁ జూచుకొని తత్తజ్జాతిసంఖ్యాక్రమంబునఁ దెలియఁజేయుట నష్టవిధంబసయును, యిన్నిమాత్రలప్రస్తారంబులలోన నిట్టియంగంబులం గలిగిన తాళంబెన్నవదని యడిగిన నాయుద్దిష్టతాళక్రమంబు నష్టతాళోద్ధారక్రమంబున(?) నెఱిఁగించుట యుద్దిష్టవిధంబని యెఱుంగఁదగు. అదియుఁ జతురశ్రాదిజాతులకన్నిటికింగలిగియుండు క్రమంబున నన్నియు నెఱింగించెద నాకర్ణింపుము —

సీ॥ అడిగినసంఖ్య మహత్తుసంఖ్యలతోనఁ
 ద్రోసి యంత్యోపాంత్యతుర్యములను
గూడి ప్లుతంబునకును భుక్తి రెండిండ్లు
 వెంబడిగాఁద్రోసి వెండి గురువు
కలరునంత్యోపాంత్యములఁగూర్చి రెండిండ్లు
 భుక్తిఁ ద్రోసి యింపులఁ జెలంగ
లఘువున కొరయిల్లు లలిఁగూర్చి యొకయిల్లె
 భుక్తివ్రాయుచుఁ జేతఁ బొసఁగు లెక్క

గీ॥ యింటిలెక్కకుఁదగ్గిన నిడుమద్రుతలు
మాత్రకొదవకు ద్రుతల నేమరక నిడుచు
నీ తెఱంగునఁ జతురంగజాతినష్ట
తాళమెఱిఁగించఁదగును సదాశివేంద్ర. 20

సీ॥ చతురశ్రతాళసంగతి నున్న లఘు గురు
 ప్లుతములఁ గాంచి యాపొక్కనిండ్లు
నవరించినరియైన సంఖ్యల కవివచ్చె
 నని భుక్తులారీతి నమరఁద్రోసి
ద్రుతములఁ గనుఁగొని ద్రుతలివి సరిపోని
 లెక్కకువచ్చిన దిక్కులనుచు

మాత్రలకొదవకు మరిద్రుతలని చెప్పి
సరిలెక్కలన్నియు సరివినొక్క

గీ॥ లెక్కగాఁగూర్చియాయంతు లెక్క మొదటి
లెక్కలోఁద్రోసి మిగిలిన లెక్కఁజూచి
తెల్పఁదగుఁ దాళమీదిక్కదనుచుఁ
దనరునుద్దిష్టమునకు సదాశివేంద్ర. 21

వ॥ ఇవి చతురశ్రనష్టోద్దిష్టవిధంబులు. ఇంకఁ ద్వ్యశ్రనష్టోద్దిష్టంబులెఱింగించెద —

సీ॥ అడిగినసంఖ్య మహత్తుసంఖ్యను డించి
యంత్యముపాంత్యపదర్కములను
గూర్చి ప్లుతానకు గొబ్బుననాఱిండ్లు
భుక్తికిఁద్రోయుచుఁబోనఁగు గురువు
కంత్యముపాంత్యపష్టాంకముల్ గూడి వెం
బడిగాను భుక్తియౌఱెడలఁద్రోసి
యంత్యముపాంత్యంబులతికించి లఘువుకు
భుక్తికినాల్గిండ్లు పంచి ద్రుతకు

గీ॥ నొక్కయిలుఁగూర్చి భుక్తియు నొకటిఁద్రోసి
యింటిలెక్కకుఁ జేలెక్క యొంటకున్నఁ
దగు నను ద్రుతమిదంగకొదవకు నదియె
తనరఁద్వ్యశ్రనష్టమిది సదాశివేంద్ర. 22

సీ॥ త్ర్యశ్రతాళమునందుఁ దద్దురితలఘుగురు
ప్లుతములుఁగని యట్టి పోల్కనిండ్లు
జతఁగూర్చిపరివచ్చుసంఖ్యలకివి నిల్పి
ననిఁదెలిపి భుక్తుల నట్లఁద్రోసి
యట యనుద్రుతలున్నవి చటపోని లె

క్కలకువచ్చెనని చొక్కముగఁ జెప్పి
కొమరొప్ప మాత్రలకొదవకు లఘుద్రుత
లనిఁదెల్పిసరిలెక్కలన్నిఁగూడి

గీ॥ యొక్కటిగఁ జేర్చియాలెక్కనొగి మహత్తు
సంఖ్యలోఁద్రోసి తక్కినసంఖ్యఁజూచి
పల్కఁదగు నిట్టితాళమీపట్టుదనుచుఁ
ద్ర్యశ్రకోద్దిష్టమునకు సదాశివేంద్ర. 23
వ॥ ఇంకమిశ్రనష్టోద్దిష్టంబు లెట్టిదనిన—

సీ॥ అడిగినసంఖ్యమహత్తుసంఖ్యల నూడ్చి
మొనసి యాంత్యోపాంత్యమునిసు కేంద్రు
లనుగూడి ప్లుతమునకనువొంద నేడింట్లు
త్రోయుచు భుక్తిగుర్తుగ గురువుకు
దీప్తినంత్యోపాంత్యనష్టమంబులఁగూర్చి
యెడపక భుక్తికేడింట్లఁదోసి
లఘువుకంత్యోపాంత్యలాలిత్యముగ భుక్తిఁ
ద్రోచియు నైదింట్లు ద్రుతకునొక్క

గీ॥ యిల్లెగూర్చియు భుక్తి యొక్కిల్లెత్రోసి
చేతిలోలెక్కనరిపోమి చేతద్రుతమి
తమిది చేలెక్కలేకున్నఁదగునన్నద్రు
తమితమిశ్రమమునకు సదాశివేంద్ర. 24

సీ॥ మిశ్రతాళమునఁగ్రమ్మిన ద్రుతలఘుగురు
ప్లుతములఁగని తొంటిగతిని యింట్లు
సమకూర్చినరివచ్చు సంఖ్యలకివికల్గె
ననిభుక్తులెప్పటియట్ల ద్రొబ్బి
యందన్నద్రుతఁజూచి యవిసరిపోని లె

క్కకువచ్చెననుచు నిక్కముగవదరి
పదరకమాత్రకు కొదవకనుద్రుత
లని సరిలెక్కయాద్యంత మొక్క

గీ॥ యొంటుగాఁ జేర్చి యాసంఖ్యయొగిమహత్తు
సంఖ్యలోఁ ద్రొబ్బిచిక్కిన సంఖ్యవట్టి
యిట్టితాళంబులీపట్ల నెనఁగుననినఁ
దనరు నుద్దిష్టమనఁగ సదాశివేంద్ర. 25

వ॥ మరియు ఖండనష్టోద్దిష్టంబులెట్టిదనిన—

సీ॥ అడిగినలెక్కమహత్తులోఁ ద్రోసియం
త్యముపాంత్యపంచమదశమములను
నతికించి ప్లుతమునకై దిండ్లఁ ద్రోసి భు
క్తికి గురువునకు నంతిమముపాంత్య
శరములుఁగూర్చి నిచ్చలుభుక్తికై దిండ్లు
నదలించి లఘువుకుఁ జక్కగాను
నంత్యముపాంత్యంబు హత్తించి మూఁడిండ్లు
భుక్తిఁ ద్రోసి ద్రుతకుఁబూన్చి యంత్య

గీ॥ మొకటిభుక్తియు నొకయిల్లె యొనఁగి చేరి
లెక్కతగ్గ ననుద్రుతలెక్కడించి
మాత్రకొదవకనుద్రుతమాత్రమునుపఁ
దగును ఖండనష్టమున సదాశివేంద్ర. 26

సీ॥ ఖండతాళమునఁజక్కఁగద్రుతలఘుగురు
ప్లుతములఁజూచి యాపోల్కిగ్రహము
లలవరింపుచు సరియైన సంఖ్యలకివి
కలవనిభుక్తుల కరణిఁ ద్రోసి
యందనుద్రుతలెంచి యవి సరిపోవని

లెక్కలఁగని యవలీలఁ దెలిపి
యాయనుద్రుతములే యటమాత్రకొదవకు
నని చెప్పి సరిలెక్కలన్ని యొక్క

గీ॥ వస్తువుగఁగూడి యాలెక్కవడిమహత్తు
లెక్కలోఁద్రొబ్బి నిల్చినలెక్కఁజూచి
మేటియగునిట్టితాళ మీచోటిదనినఁ
దగును నుద్దిష్టమునకు సదాశివేంద్ర. 27

వ॥ ఇఁక సంకీర్ణ జాతీయనష్టోద్దిష్టంబుల నేర్పరించెద నాకర్ణింపుము.

సీ॥ అడిగినసంఖ్యామహత్తు సంఖ్యనుద్రోసి
యంత్యముపాంత్యంబునల విరించి
పర్వంబులనుఁగూర్చి పరఁగఁ దొమ్మిదియిండ్లు
భుక్తికిఁద్రోసియుఁబోరి గురునకు
నంత్యముపాత్యంబు నావిరించినిఁగూర్చి
భుక్తిఁదొమ్మిదియిండ్లు పొసరఁద్రోసి
యమరించి లఘువుకునత్యముపాత్యంబు
భుక్తికేడిండ్లు సొంపునను బెనిచి

గీ॥ యొక్కటిఘటించిభుక్తికి నొకటిడించి
చేతిలోలెక్కసరిపోమి చేననుద్రు
తములఁగూర్చి కొదవకు ద్రుతము లెగూర్పఁ
దగు విమిశ్రనష్టమున సదాశివేంద్ర. 28

సీ॥ సంకీర్ణతాళ మెంచఁగ ద్రుతలఘుగురు
ప్లుతములఁగాంచి యాస్థితిని యిండ్లు
(1) నవరించి సరివచ్చు సంఖ్యలకివివచ్చె

---

(1) ఈ సీసపాదము మాతృకలో నీరీతిఁ గానఁబడుచున్నది.
"ఖండించి సరివచ్చు సంఖ్యలకివివచ్చె" ఇచ్చట 'ఖండించి' యనుపదము యుపార్థము నిచ్చుచున్నది. మరియు యతిభంగమునకుఁగూడ కారణమగు చున్నది.

నని తోఁచి మున్నటియట్లభక్తిఁ
జూచి యనుద్రుతచోట్లవి సరిపోని
సంఖ్యలవనుచు నిశ్చయముచేసి
మాత్రలకొదవకు మలయుననుద్రుత
లనియును సరిలెక్కలన్ని జేర్చి

గీ॥ (1) లెక్కయొక్కటఁగూర్చి యాలెక్క మొదటి
లెక్కలోద్రోబ్బి మిగిలిన లెక్కఁగొనుచు
చక్కనిటువంటి తాళమీచక్కిదనిసఁ
దనరు నుద్దిష్టమనఁగ సదాశివేంద్ర. 29

వ॥ ఇవ్విధంబున సకలజాతీయతాళవృత్తంబుల నష్టోద్దిష్టంబుల తెఱంగెఱింగించితి. ఇఁకఁ జతురశ్రాదిపంచజాతీయమేరులక్షణంబు లెఱింగించెద. అదియు జాతిలక్షణానుద్రుతద్రుతాది కాంగ నిచయప్రధానతంత్రంబులగుటం జేసి యాయంత్రంబులకుఁ గ్రమంబుగా ననుద్రుతయంత్రంబనియును (2) ద్రుతయంత్రంబనియును లఘుయంత్రంబనియును గురుయంత్రంబనియును ప్లుతయంత్రంబనియును వేర్వేర నాయంత్రగతి ప్రధానాభిధానంబులుఁ గల్గియుండు. ఇట్లు పంచవిధంబులైన యాయంత్రంబులకు మేరువులనియును గోపురంబులనియును చక్రంబులనియును వలయంబులనియును నామంబులనేకంబులు గలవు. తత్తన్నామధేయంబులచేత నీమేరులక్షణంబుల వివరించెద, నచ్చటచ్చట బుద్ధిమంతులుచూచి తెలియవలయు. అట్లు పంచాంగప్రాధాన్యముచేఁ బంచవిధంబులైన మేరువులు జాతిభేదంబులచేతను మఱియుఁ బంచవిధంబులైయుండు. ఇట్లు (3) పంచవిధంబులైన మేరు

(1) ఈ సీసముయొక్క గీతిలోని మొదటి రెండుపాదములు మాతృకలో నీ క్రిందివిధముగాఁ గన్పడుచున్నది. "లెక్కయొక్కగాగూర్చి యా లెక్క మొదటి, లెక్కలో ద్రొబ్బిమిక్కిలి లెక్కగొనుచు'

(2) "ద్రుతయంత్రంబనియును" అను నీవాక్యము మాతృకయందుఁగానంబడుటలేదు.

(3) మాతృకలో "దశవిధంబులైన' అనియున్నది.

వులు జాతులలోనఁ బ్రత్యేకంబుగాఁ జతురశ్రజాతి చతురంగ ప్రధానంబు గావునఁ దజ్జాతియందుఁ జతుర్విధంబులయ్యెను. త్ర్యశ్రాదిజాతులు నాల్గును పంచాంగప్రధానంబులగుటంజేసి తజ్జాతులందుఁ బ్రత్యేకించి పంచాంగప్రధానంబులయ్యెఁ గావున చతురశ్రయంత్రంబులు నాల్గును త్ర్యశ్రాదియంత్రంబులు నిరువదిభేదంబుల నేకంబుగా లెక్కించి వర్గించిన నిరువదినాల్గుభేదంబులై వర్తిల్లు. ఇట్లు చతుర్వింశతి భేదంబులం బ్రవర్తిల్లు సకలజాతీయయంత్రంబులకు నిరూపణప్రయోజనంబేమి యనిన నాజాతియందు నిన్నిమాత్రలప్రస్తారంబులలోన నిన్నియంగంబులులేని తాళంబులిన్నియనియును, యన్నియంగంబులుఁగల్గిన తాళంబులిన్నియనియునుఁ దెలిసి చెప్పుటకు సాధనంబులగుటంజేసి, యీ యంత్రనిరూపణంబు సప్రయోజనంబే కాని యప్రయోజనంబు కాదిది యట్లుండనిమ్ము కాండ తాండవంబులుచాలు. తన్నిరూపణ ప్రకారంబెట్టిదనిన. ఇట్లు చతుర్వింశతిప్రకారంబులైన గోపురంబుల లోన వేర్వేర లక్షణపరీక్షలు క్రమంబుగాఁ జేయఁదగుటంజేసి జాత్యుద్దేశక్రమంబున మొదటఁ జతురశ్రయంత్రంబులు నిరూపింపఁబూని యందులో నుద్దేశానుగుణంబుగా ద్రుతయంత్రంబు మొదటిది గావునఁ దల్లక్షణంబు నిరూపించెద నాకర్ణింపుము.

క॥ చతురశ్రజాతి మొదలుగ
వితతాళల జాతులకును వివరించెద నే
ద్రుతయంత్రలేఖనక్రమ
మతులితగతి శ్రీసదాశివావనీరమణా. 30

క॥ మొదటిల్లొక్కటి వ్రాయుచుఁ
గదియింపుము రెండురెండుగా మీదింట్లన్
మదికెంతవలసెనంతయుఁ
దదభిజ్ఞానాఢ్య శ్రీసదాశివనృపతీ. 31

మ॥ మొదటింటన్ ద్రుత మొక్కటుంచుకొని యింపుల్ గుల్కనొం
డొందుగాఁ
దుదదన్కన్ ద్రుత హెచ్చుగూర్చుగ మహత్తుల్ చేసిజాదిండ్లకై
నొదిగింపన్ దగు సంగపంక్తిచతురశ్రోదార జాతిన్ ద్రుతా
న్వదయంత్రాదిగ శ్రీసదాశివమహీపా నాల్గుయంత్రంబులన్

కం॥ సమకోష్ఠవిషమకోష్ఠ
క్రమమిది వినుమిందు ద్రుతముఁగల యవి విషమా
ఖ్యములగును లఘువు గురువు ప్లు
తములన్నవి సమములగు సదాశివభూపా. 33

కం॥ అమరఁజతుర్వింశతియం
త్రములకుఁ దగుఁ గ్రిందిబంతి దగ్గరియాశల్
క్రమముగ జాదిటిబంతుల
కమరును యది శ్రీసదాశివావనీనాథా. 34

కం॥ వరలఘుగురుప్లుతంబుల
కిరవగు కోష్ఠముల కాశయింపగుగా కా
పరమాశ కడమయిండ్లకుఁ
దరమా రెయునఁగూర్చ శ్రీసదాశివశౌరీ. 35

కం॥ ద్రుతయంత్రమహత్తుల సం
గతిఁబొల్పడి రెండురెండుగా మనునిండ్లన్
జతురత నొక్కటిలెక్కలె
యతికింపుము శ్రీసదాశివావనీరమణా. 36

సీ॥ తగ ద్రుతయంత్రమందలి క్రిందిబంతిని
విషమకోష్ఠాలకు వెరఁగుఁగూర్చ
వలయు నంత్యోపాంత్యములు తుర్యషష్ఠముల్
కూర్చిపిమ్మట సమకోష్ఠములకు

నంత్యము విడిచి యుపాంత్యతురీయష
ష్ఠములఁ గూర్పఁగఁ దగు సరసముగను
నవలనాపై బంతులందు విషమకోష్ఠ
ములకు నంత్యోపాంత్యములు తురీయ

ఆ॥వె॥ షష్ఠములనుగూడి సమకోష్ఠములకెల్ల
నంత్యమును విడిచి యథాంత్యసహిత
ముగ నుపాంత్యతుర్యములు షష్ఠమునుఁ గూర్ప
నగును శ్రీసదాశివావనీంద్ర. 37

కం॥ వివరించెద వినుము సదా
శివవసుధానాథతిలక చెల్వొగఁ జతుర
శ్రవరద్రుతయంత్రఫల
ప్రవినుతలక్షణము శాస్త్రపద్ధతి వెలయన్. 38

సీ॥ వెనన ధఃపంక్తిలో విషమకోష్ఠపుక్రింది
లెక్కలొక్కొక ద్రుత లెక్క తాళ
ములటంచు మీఁది లెక్కలు మూఁడునై దును
లెక్క మొదలుచేసి లెక్క చేత
ద్రుతగల్గు తాళ సంతతులని పలికియు
సమకోష్ఠములక్రింది సంఖ్యలెల్ల
ద్రుతహీనములటంచు మతినెంచి మీఁది బం
తుల లెక్క రెండు మొదలుగను సరి

ఆ॥వె॥ లెక్క చేత ద్రుతల యెక్కువల్ కలిగిన
తాళమనుచుఁ జెప్పఁ దగు మహాత్మ
సరస లెక్కలెల్ల సర్వద్రుతములన
వయ్య శ్రీసదాశివక్షితీంద్ర. 39

కం॥ చతురశ్రలఘుగురుప్లుత
యుతయంత్రవిలేఖనంబు సుజ్వలసంఖ్యా
గతియుఫలక్రమమును శా
శ్వతముగ నెంచెద సదాశివత్స్మారమణా. 40

కం॥ చతురశ్రద్రుతయంత్రము
గతి నాలఘుయంత్రవిధముఁగని వ్రాయఁదగుఁ
వితరణవైభవజితనూ
తతనయ చెఱుకూరి శ్రీసదాశివసదయా. 41

సీ॥ చతురశ్రలఘుమేరుసరణియందొనరిన
యధరపంక్తికి నుపాంత్యంబు విడిచి
యంత్యతుర్యములతో నవలివమ్ముఁగూర్చి
వరుసతోఁబైనున్న వరుసలకును
నంత్యంబులోనుపాంత్యాధరస్థానంబు
[illegible]
వెనచి క్రిందిటిబంతిఁవెనఁగొన్న లెక్కలు
లఘుహీనతాళములనుచు నుడివి

గీ॥ మీఁదిబంతుఁలు నాలకొన్న మేటిలెక్క
లొకటి రెండు మొదలుగ నేకోత్తరముగఁ
గలుగులెక్కల లఘుయుక్తములని దెలుప
వలయు భరతజ్ఞులు సదాశివక్షితీంద్ర. 42

గీ॥ మొదట మూఁడిండ్లు లిఖియించి పిదప నాల్గు
మీఁదినెలవులు ఘటియించి మేటినటుఁదు
వలసినంతయు గురుమేరువలయునిట్లు
వ్రాయవలయునయ్య సదాశివక్షితీంద్ర. 43

సీ॥ గురుయంత్రమునఁ గ్రిందివరుసఁదుర్యముసూడ్చి
యంత్యముపాంత్యమస్థానములను

నతించి పై బంతులందుఁ దుర్యాధర
స్థానమంత్యోపాంత్యషష్ఠములను
గూర్చి క్రిందిటిబంతిఁగూర్చున్న లెక్కలు
గురుహీనములటంచు గురు తెలంగి
యూర్ధ్వపంక్తులలెక్కలొకటిరెండునుమూఁడు
మొదలునేకోత్తరముగను బెరుగు

గీ॥ సంఖ్యలనువుగఁ జేకొనిశాస్త్రవిదులు
గురుసమన్వితతాళనికరములనుచుఁ
దెల్లమిగఁజూచి బోధింతురెల్లజనుల
చిత్తజసరూప శ్రీసదాశివమహీప. 44

కం॥ ఐదుగృహంబులు మొదటను
మోదముతోవ్రాసి యాఱు ముఖ్యగృహంబుల్
మీఁద లిఖింపుము ప్లుతయం
త్రోదయమున శ్రీసదాశివోర్వీనాథా. 45

సీ॥ భూదేవజాతిలోఁ బ్లుతయంత్రమునఁగింది
దొంతికంత్యోపాంత్యతుర్యములను
షష్ఠిహీనముగాను సంఖ్యకు నొనఁగూర్చి
పై బంతులకునెల్ల భరతవేత్త
లంత్యముపాంత్యతుర్యములుషష్ఠాధర
స్థానంబుతోఁ జేర్చి సంఖ్యఁజేసి
పాలి నధఃపంక్తిలోఁ బొసఁగినలెక్కలు
ప్లుతహీనములటంచు బుద్ధినెఱిఁగి
గీ॥ యుపరిపంక్తులలెక్కలు నొకటిరెండు
మొదలు నేకోత్తరంబుగా మొనయులెక్క
లను గుణింపుదురు ప్లుతతాళములటంచు
శ్రీకరకలాప శ్రీసదాశివమహీప. 46

సీ॥ లఘుగురుప్లుతమేరులసమమహాత్తుల
దండనుండినరీయింట్లు దన్నరునర్వ
లఘుగురుప్లుతయుక్తలలితతాళములంచు
నెంచుచో రామలింగేంద్రపుత్ర
యామేరువులయందు నమరిన విషమశో
ష్ఠమహాత్తుల సరసనమరులెక్క
లెల్ల నేకోత్తరవృద్ధిగా మీరిన
లెక్కలతోఁగూర్చిలెక్క సేయు

ఆ॥వె॥ తాళచయములనుచుఁ దమరెంచి చతురశ్ర
లఘుగురుప్లుతోపలలితయంత్ర
ఫలములిటులు నటులు పరిపాటిదెలుపఁగ
వలయు శ్రీసదాశివక్షితీంద్ర. 47

కం॥ ఈమాడ్కి విప్రజాతిమ
హామేరువలయచతుష్టయనిరూపణముఁ
నేమంబునఁజేసితి ను
ద్దామగుణాధార శ్రీసదాశివధీరా. 48

కం॥ భూనాథజాతి మొదలుగ
నానాలుగుజాతులందు నమరించెద నే
పూనిక సమస్తమేరు
స్థానకలక్షణము శ్రీసదాశివభూపా. 49

వ॥ ఇట్లు నిరూపణీయంబులైన యీనాల్గుజాతుల యంత్రంబులలోనఁ ద్ర్యశ్రాదియంత్రంబులు మొదటవివరించుచోట క్రమంబుగా నన్ద్రుతాదియంత్రలక్షణంబుల నిరూపించుచు మొదట నాయంత్రంబులన్నిటికిని వరుసగా గృహనిర్మాణక్రమంబులును దాళసంఖ్యాసందర్భలక్షణంబులును నేర్పున నేర్పరించెద నాకర్ణింపుము.

ఆ॥వె॥ ద్రుతము మొదలుగాఁగఁ జతురశ్రజాతియ
యంత్రమునకుఁ గల్గునంగపంక్తు
లట్లనుద్రుతాదికాంగపంక్తులితర
యంత్రములు సదాశివావనీంద్ర. 50

ఉత్సాహ॥ రాజముఖ్య చతురుదారరమ్యజాతులందు వి
భ్రాజి శ్రీసదాశివేంద్ర భవ్యమధురసుకవితా
భోజ మొదటియింట ద్విపదముఁ లిఖించి ముందరిం
డ్లోజనొకటియొకటి వ్రాయనొప్పు మొదటిమేరువఁ. 51

కం॥ విశదానుద్రుతమేరువు
వశమునవిలసిల్లు క్రిందివరుసకునంత్య
ప్రశమము షష్ఠార్కాష్ట
దశమముపాంత్యమొనరును సదాశివనృపతీ. 52

కం॥ అరయననుద్రుతమేరూ
పరిపంక్తికధోంత్యగృహముపాంత్యషడర్కా
వరపర్వంబులుఁ గూర్పుట
ధరమెచ్చినదారి శ్రీసదాశివశౌరీ. 53

కం॥ చతురశ్రద్రుతయంత్రము
వితతము నృపముఖవిజాతివితతసమస్త
ద్రుతయంత్రంబులవ్రాయుము
చతురతను సదాశివేంద్ర సద్గుణసాంద్రా. 54

కం॥ ద్రుతయంత్రాధఃపంక్తికి
నతుకునుపాంత్యంబువిడిచి యంత్యషడర్క
స్తుతపర్వసంఖ్యలన్నియుఁ
దతకీర్తికలాప శ్రీసదాశివభూపా. 55

కం॥ ద్రుతమేహాపరిపంక్తుల
కతికింపు షడర్కపర్వకాంత్యోపాంత్యాం
చితగేహాదరములు సం
తతదానవిహార శ్రీసదాశివధీరా. 56

కం॥ ఆరయమొదటింౘ్డైదును
నాఱారుగ ముందరిండ్లు నమరఁగ వ్రాయ౯
మీఁదును లఘుమేరువు వి
ద్యారమణప్రవీణమతి సదాశివనృపతీ. 57

ఉ॥ ఆఱవదిక్కుదర్క మరియంత్యముపాంత్యము భానుపర్వముల్
కూరిచి క్రిందిబంతికి లఘుస్ఫుటమేరున మీఁదిబంతికై
యాఱవచోటక్రిందికడనంటిన లెక్క యుపాంత్యమంత్యమిం
పారగ భానుపర్వములు పర్విన మేలు సదాశివాగ్రణీ. 58

కం॥ గురుమేరులేఖనక్రమ
మరుదుగఁదెల్పెద సదాశివాగ్రణి వినుమా
పొరి పదునొకండు మొదటిం
డ్లిరవుగఁబంౘ్రడెందు మీఁదిటిండ్లౌ వెలయు౯. 59

కం॥ గురుయంత్రాధఃపంక్తికిఁ
బొరి నంత్యోపాంత్యషష్ఠములు పర్వంబుల్
పరిగాఁగూర్చుము ద్వాదశ
తరసంఖ్య వెడల్చి శ్రీసదాశివశౌరీ. 60

కం॥ గురుయంత్రంబును మీఁదిటి
వరుసలకంత్యమునుపాంత్యవరషష్ఠంబుల్
మరిగూర్చవలయుఁ (1) గర్కా
ధరగేహముఁబర్వమును సదాశివభూపా. 61

---

(1) ఇచ్చట "నర్కాధరగేహ"మని యుండఁదగు.

కం॥ పదునేడు మొదటిగృహములు
పదునెనిమిదిముందరిండ్లు బాగుగ వ్రాయన్
జదురగు ప్లుతయంత్రము సా
ఖ్యదనుగుణా శ్రీసదాశివావనీరమణా. 62

శా॥ అంత్యోపాంత్యమడర్కముల్ గొనుచు నాయష్టాదశంబాడ్చిన
త్కాంత్యంబాశుగఁ గ్రిందిపంక్తికిఁ బొసంగన్నీదిటి శ్రేణి కా
యంత్యోపాంత్యమడర్కయుక్తముగ నాయష్టాదశాధోం
కమున్
దాంత్యన్వీత సదాశివేంద్ర ప్లుతయంత్రానన్ ఘటింపందగున్

వ॥ మరియు మిశ్రాదిజాతీయయంత్రంబుల నిరూపించెద. అందు ద్రుతానుద్రుతయంత్రలేఖనక్రమంబులు తత్ప్రధానంబులైన చతురశ్రత్ర్యశ్రజాతియంత్రవివరణావసరంబులయందు సర్వజాతిసమానంబులుగామున్నేర్పరచుటంజేసి తల్లక్షణంబులిచ్చట మగుడ నేర్పరచినఁజర్వితచర్వణప్రాయంబై పిష్టపేషణన్యాయంబై యప్రయోజనంబై యుండునటుగా వునమిశ్రాదిజాతీయంబులైన లఘ్వాదియంత్రంబులకుమాత్రంబే గృహలేఖనక్రమంబుల ముందర వరుసఁగా వివరించి పిమ్మట నన్నిటికి సంఖ్యాక్రమంబుల నిరూపించి వెండియుఁ ద్ర్యశ్రాదిజాతీయసకలయంత్రబులకు ఫలక్రమంబు లొక్కసారి నిరూపించెద నవధరింపుము.

కం॥ ఆఱవ్యో మొదటిగేహము
లాతొకటియు ముందరిండ్లు నామిశ్రమునం
దాహూధభోగవిజితబ
లారాతి సదాశివేంద్ర లఘుమెరునకున్ 64

కం॥ పదుమూఁడు మొదటిగృహములు
పదునాల్గుముందరిండ్లు పాల్పడవ్రాయన్

వదయ సదాశివభూపా
కుదురగు సామిశ్రజాతిగురుయంత్రంబై. 65

కం॥ మొదటిండ్లిరువది ముందరి
పదములు నిరువదియునొకటి పరఁగ లిఖించన్
జదురొప్పును ప్లుతయంత్రము
సదాశివమహీంద్ర మిశ్రజాతీయంబై. 66

కం॥ ముందరి గేహము లేనును
బొందుగ లిఖయించి నాల్గు మొదటిగృహంబుల్
చెందించుము లఘుమేరువు
నందు సదాశివనృపాల యాఖండమునన్. 67

కం॥ తొమ్మిది మొదటిగృహంబుల
నిమ్ముల లిఖయించి ముందరిండ్లును పదియు
న్తమ్ముగ వ్రాసిన యం
త్రమ్మె ఖండంబునన్ సదాశివ యొప్పున్. 68

కం॥ ఖండప్లుతయంత్రమ్మున
కిండులు పదునాల్గు ముందరిండ్లుప దేనున్
నిండ లిఖించుము గర్వో
ద్దండాహితహరణ శ్రీసదాశివరమణా. 69

సీ॥ మొదటిమ్మలెనిమిది ముందరిగృహములు
తొమ్మిదియు లఘుయంత్రమ్మునకును,
మొదటిండ్లు పదునేడు ముందరిండులు పదు
నెనిమిది గురుమేరువునకుఁ దనరు,
నిరువదియారును నిరువదియేడును
నాంద్యంతవుల ప్లుతయంత్రమునకు
గృహములు వెలయు సంకీర్ణజాతిని యుంచు
భరతవిద్యాధిక[illegible] పల్కు-

గీ॥ నార్యనుతశీల నిఖలవిద్యావిశాల
శాలిగుణజాల సుమబాణసదృశలీల
శైవమతలోల భూరివిస్ఫారఫాల
(1) దివిజసమలీల శ్రీసదాశివనృపాల. 70

వ॥ సంఖ్యాలక్షణంబెట్టిదనిన —

సీ॥ అంత్యంబు విడిచి యుపాంత్యమునీంద్రమూ
ర్ఛనలుఁ గూర్చుము మిశ్రజాతియందు
నాయనుద్రుతమేరునందుఁ గ్రిందిటిబంతి
కవలపై బంతుల నంత్యమునకు
నధరగృహంబు నుపాంత్యమునీంద్రమూ
ర్ఛనలతికింపుమాజాతియందె
ద్రుతయంత్రమునఁ గ్రింది వితతంబుబంతికు
పాంత్యంబు విడిచి యంత్యంబుతోడ

గీ॥ వరమునీంద్రమూర్ఛనలను వరుసఁ గూర్చి
యవలపై బంతులకు నుపాంత్యాధరంబు
నంత్యము మునీంద్రమూర్ఛనలతకవలయు
శ్రీ (2) కరవిహార శ్రీసదాశివసుధీర. 71

సీ॥ అంత్యముపాంత్యంబు నమరేంద్రమూర్ఛన
లతికించి మునులను నవలఁద్రోసి
లఘుయంత్రమునఁ గ్రిందిలాలితపంక్తికి
నటమీఁదిబంతుల కమ్మునీంద్రు
నధరగేహంబును నంత్యంబుపాంత్యంబు
నింద్రమూర్ఛనముల నెనయఁజేసి

(1) మాతృకలోని యీగీతిపాదమిట్లున్నది "కలిదివిజపాత్రీసదాశివనృపాలా"
(2) మాతృకలో నీపాద మీవిధముగానున్నది. " శ్రీ కదళీహారశ్రీసదాశివసుధీరా"

గురుయంత్రమునఁ గ్రిందిి వరపంక్తి కింద్రునిఁ
బుచ్చియంత్యోపాంత్యములను మూర్ఛ

గీ॥ నంబునొానఁ గూర్చిపై బంతికింబలారి
యడుగులెక్కయు నంత్యముపాంత్యమునులు
మూర్ఛనముఁ గూర్పఁదగు మిశ్రమునఁ దలంప
నవితకవిజాల శ్రీసదాశివనృపాల. 72

చం॥ అమరగ మిశ్రజాతిని ప్లుతాన్వితయంత్రముక్రిందిపంక్తికం
త్యమును నుపాత్యముల్ మునిసురాధిపులకొ ఘటియించియుం
జనిం
చి మొదలు మూర్ఛనంబుపరిశీమకుఁగూర్చుము మూర్ఛ
నాధరాం
త్యములును పాంత్యముల్ మునివరామరనాథుల శ్రీసదాశివా

చం॥ ఒనరఁగ ఖండజాతిని యనుద్రుతమేరువునందుఁ గ్రింది బం
తినతుక నంత్యముల్ విడువ నేర్చియుపాంత్య శరావతారముల్
ఘనతిథియుక్త మిట్టుపరికల్పితసీమకధోంత్యమందిరం
బెనయ నుపాంత్యముల్ దగుపదేను పదేను సదాశివాగ్రణీ. 74

మ॥ అతికించఁదగుఁ గ్రిందిబంతికి నుపాంత్యంబూడ్చి యత్యాంకనం
యుతమానట్లు శరవతారతిథులార్యుల్ మెచ్చఁబై బంతికిఁ
జతగా నంత్యశరవతారతిథులుంచంగా నుపాంత్యాధరం
బతుకుఁ దాన సదాశివేంద్ర తుదయంత్రస్థానికిఁ యుక్తమై.

సీ॥ పొనఁగనంత్యోపాంత్యములు నవతారతి
థులుఁ గూర్చి శరసంఖ్యఁ దొలఁగఁ జేసి
లఘుమేరునకుఁ గ్రిందిలనమానపంక్తికి
నటమీఁది బంతుల కనువుపఱపు
మంత్యంబుపాత్యంబు నటశరాధస్థాన

మవతారతిథులు ఖండాఖ్యజాతి
గురుగోపురముక్రిందిగీకొన్న బంతుల
నవతారసంఖ్యలునాయెఁగనుక

గీ॥ నంత్యమునుపాంత్యము నైదునటపదేనుఁ
గూర్చఁదగు నంతపై బంతిఁ జేర్చవలయు
నంత్యము నుపాంత్యము దశమాంధరఁబు
నైదునుపదేనును శ్రీసదాశివేంద్ర. 76

మ॥ పదియేనంటగరాదుగానికదియింపన్ బోల్చునంత్యంబుపాం
త్యదశస్థానశిలీముఖంబులను గ్రిందంగల్గుకోష్ఠానకిం
పొదవంగాఁబ్లుతగోపురోపరికి నంత్యోపాంత్యపంచాంశపం
చదశాధోకంములన్ సదాశివమహీశాయాదశస్థానముల్.77

సీ॥ అంత్యమంటకయుపాంత్యవిరించి పర్వభ
ములుఁగూర్చి క్రిందటిమ్మొలకునెల్ల
నంశరానుద్రుతచారు మేరువునందుఁ
బై బంతులకధోంత్య భాసురమగు
నెంచియుపాంత్యవిరించిపర్వభముల
నతికి యంతటద్రుతయంత్రమునకుఁ
గ్రిందిండ్ల నంతవిరించిపర్వభములు
కదియ నుపాంత్యంబుఁగడకుద్రొబ్బి

గీ॥ యంత్యసంఖ్యయు మఱియుపాంత్యాధరంబుఁ
బోలఁగ విరించిపర్వభములు ఘటించి
పరఁగఁబై బంతులిట్లు నేర్పరచవలయు
సింధుగంభీర శ్రీసదాశివవజీర. 78

సీ॥ లఘుమేరునకుఁ గ్రిందలలిమీరుపంక్తికి
నంత్యముపాంత్యంబు నమరఁగూర్చి

విడిచి విరించిని వెలయించి పర్వభం
బులనంతమీఁది పంక్తులకునెల్ల
నంత్యముపాత్యంబు నటవిరించికిఁగ్రింది
సంఖ్యయు పగ్వభసంఖ్యలుంచి
యంతట గురుమేరు నధరపంక్తికిఁబర్వ
మణఁచి యంత్యముపాంత్యమావిరించి
భముల నొనఁగూర్చిపై బంతిపట్లకంత్య
సంఖ్యయు నుపాంత్యము విరించిసంఖ్యకమరి
పర్వకాధరభముల జార్వంగవలయు
జితవిమతజాల శ్రీసదాశివనృపాల. 79

శా॥ సంకీర్ణప్లుతగోపురాధరసమంచద్వీథికింగూర్చుమం
త్యాంకోపాంత్యవిరించి పర్వములుడయ్యాంజేసియాభాంకమా
పాంకింగూర్చు మీఁదిబంతులకునింపుల్ గుల్ల నాధోంకమం
త్యాంకోపాంత్యముల్ సదాశివమహీంద్రా బహ్మపర్వం
బుల్. 80

కం॥ భూవరముఖజాతులయెడ
భావించిన యంత్రములకు ఫలవిధమింతే
భావుకముగఁదెల్పెద స
ద్భావంబున వినుము శ్రీసదాశివధీరా. 81

వ॥ అందు నొక్కవిశేషంబుగలదు. త్ర్యశ్రాదిజాతీయయం త్రంబులన్నిటిలోన సర్వజాతీయానుద్రుతయంత్రంబులకు ఫలవిధం బొక్కవిధంబై యుండు. తత్సకలజాతీయంబులైన ద్రుతలఘ్వాదియం త్రంబుల నేర్పరించి యెటింగించెద నాకర్ణింపుము.

సీ॥ ఆయనుద్రుతమేరులందుఁ గ్రిందిటిబంతి
నున్న నున్నలయిండ్లనుద్రుతంబు
గలశాళములెగాని గలుగని శాళముల్

లేవని లిఖయించి లెక్కలున్న
యిండ్లనుద్రుతముతో హీనంబులని చెప్పి
పై బంతినున్నల పట్టులెల్ల
నొక్కటాదిగను నేకోత్తరవృద్ధిసం
ఖ్యలనున్న సుద్రుతల్ గల్గుతాళ
గీ॥ ములుఘటించవనియు లెక్కలోలయనిమ్మ
యిట్లు తెల్పు మేకోత్తరవృద్ధిసంఖ్య
తగలనన్నియనుద్రుత తాళములని
త్ర్యశ్రముఖజాతులందు సదాశివేంద్ర. 82

వ॥ ద్రుతలఘ్వాదినిఖిలయంత్రఫలలక్షణం బెట్టిదనిన—

సీ॥ ద్రుతలఘువరగురుప్లుతయంత్రములక్రింద
నలువొందుబంతిలెక్కలుగణించు
కొని ద్రుతలఘుహీనగురువరప్లుతహీన
తాళంబులని పల్కు ధర్మమజియు
బై బంతియిండ్లలోపలనున్న లెక్కలు
ద్రుతలఘుయుక్తతాళతతులనియు
వరగురుప్లుతయుక్తవర తాళములటంచు
నొకటియాద్యముగ నేకోత్తరంబు
గీ॥ గలిగివర్ధిల్లు లెక్కలుగలియ బెనచి
యెంచి యిన్నిన్నియని యేర్పరింపవలయు
ద్ర్యశ్రముఖజాతియంత్రముల్ తనర జూచి
యవితథవిజాల శ్రీసదాశివనృపాల. 83

వ॥ మఱియు నీయనుద్రుతాదిచతుర్జాతియంత్రంబులు రెండు విధంబులై యొప్పు నదియును నేర్పరింతు. సమకోష్ఠవిషమకోష్ఠ మహాత్వనిదానంబుల డాసియుండు సంఖ్యలకు ఫలవిధం బెఱిగించెద నాకర్ణింపుము.

మ॥ సమకోష్ఠంబుమహత్తుదగ్గరను నిచ్చల్ నిల్చుసంఖ్యాళి ని
త్యమునర్వ్యద్రుతలంచు మున్ బలుకనాయాత్ర్యశ్రజాత్యాశ్రయం
త్రములందీవిధిఁ జెల్లునట్లు పెనఁగొన్న న్ శశికోష్ఠంబులన్
గ్రమసంఖ్యన్ గొని శ్రీసదాశివమహీంద్రా తెల్పుమాసం
ఖ్యలన్. 84

వ॥ ఇట్లు తాళదశప్రాణంబులనిరూపించి మఱియు నేతద్దశప్రాణ యుక్తంబులైన తాళంబులు జాతిభేదంబుల వలన ననంతభేదంబులం గల్గియుండు, అందు మార్గదర్శనార్థంబుగాఁ గొన్ని తాళలక్షణంబు లెఱిఁగించెదనని యెట్టిదనిన. పంచతాళంబులనియును సప్తతాళంబు లనియును సతతశైలూషప్రయుక్తతౌర్యత్రికవ్యవహారసిద్ధంబులై యుండు. అందుఁ బంచతాళనిరూపణంబు మొదటఁగావించి పిమ్మట సప్తతాళనిరూపణంబుఁగావించెద. ఆపంచతాళంబులన్నది చచ్చత్పుటంబనియును, చాచపుటంబనియును, షట్పితాపుత్రకంబనియును (1) సంపద్వేష్టంబనియును, ఉద్ఘట్టంబనియు నైదుతెఱంగులై పరమేశ్వరపంచముఖంబులవలన నుదయించి తనరుచుండు. తల్లక్షణంబుఁ గ్రమంబుగ నిరూపించెద నవధరింపుము.

సీ॥ లలిగురువులురెండు లఘువును బ్లుతమును
జతఁగూర్పనదియ చచ్చత్పుటంబు
నిరుచక్కియలనుండు గురువులనడుమను
సల్లఘుయుగ్మము చాచపుటము
ప్లుతలఘుగురుయుగ్మయుతలఘుప్లుతములు
పూనిన షట్పితాపుత్రకంబు
మగణపార్శ్వములందు మరిప్లుతంబులురెండు
తనరు సంపద్వేష్టతాళమునకుఁ
గీ॥ గలిగియుండును మగణముద్ఘట్టమునకు
నిత్యతాళంబులైదును నింపుమిగులు

(1) సంపద్వేష్టాకమనియుండఁదగు.

కాలవిధముష్ణ నీపంచ తాళములకుఁ
బంచజాతులయందు నేర్పాటు తెలియ
వలయునయ్యా సదాశివవసుమతీశ. 85

వ॥ మఱియు సప్తతాళంబులెట్టివనిన.

కం॥ ధ్రువమును మఠ్యము రూపక
మవలను ఝంపాత్రిపుటములట తాళమ్ముల్
భువి నేక తాళమనినే
డవు తాళమ్ములు సదాశివావనీనాథా. 86

వ॥ తల్లక్షణం బెట్టిదనిన.

సీ॥ లఘుగురుద్రుతములు లలితధ్రువంబయ్యె
మరిలఘుద్రుతలఘుల్ మఠ్యమయ్యె
ద్రుతమునులఘువును రూపకంబగునని
ద్రుతమును (1) ద్రుతలఘువమరఝంప
ద్రుతములుమూఁడును ద్రుత మొక్కటియుఁగూడఁ
ద్రిపుట తాళంబనఁ దేజరిల్లు
నాంద్యంతలఘుమధ్యమానీతద్రుతయుగ్మ
మట తాళ మేకద్రుతాన్వితంబు

ఆ॥వె॥ నేక తాళమయ్యెనిందు ఝంపత్రిపు
టములు విప్రజాతినమరక తది
తరకులములనుండుఁదజ్జ్ఞాన మగుఁదాళ
భేదమున సదాశివామతారి. 87

ఆ॥వె॥ ఇతరరూపకాదిహీత తాళపంచక
మెంచవచ్చుజాతిపంచకమున

1 "ద్రుతమను ద్రుతలఘువమరఝంప" అని పాఠముండవలెను.

వానిభేదమరయవలయును దత్కాల
భేదమున సదాశివామరారీ. 88

కం॥ ఝంపాత్రిపుటలనుద్రుత
పంపన్నములగుటఁజేసి చతురశ్రమునన్
రంపిల్లవధితధీనత
నింపూనగ శ్రీసదాశివేంద్రప్రవరా. 89

వ॥ ఇట్లునిరూపితంబైన చచ్చత్పుటాది పంచతాళంబులును, ధ్రువాదిసప్తతాళంబులునుగూడనన్నియు జాతిభేదంబులవలనఁ జేసి యష్టపంచాశద్భేదంబులఁబ్రవర్తిల్లు. అది యెట్లన్నఁజచ్చత్పుటాదులైదును నైదుజాతులందునుఁ గలుగుటఁజేసి యొక్కొక్కజాతి కైదైదుభేదంబులుగావున నైదైదు లిరువదియైదుభేదంబులయ్యె. మఱియు సప్తతాళంబులోన ఝంపాత్రిపుటతాళంబులు విప్రజాతి యందు సంభవించి త్ర్యశ్రాదిజాతులు నాల్గింటను సంభవించుటవలన నాల్గురెండ్లెనిమిదిభేదంబులయ్యె. కడమధ్రువాదితాళంబులైదును బంచజాతులయందును గలిగియుండుటఁజేసి యైదైదు లిరువదియైదు విధంబులై వర్తిల్లె. ఇవియును ఝంపాత్రిపుటభేదంబు లెనిమిదియును గూడ ముప్పదిమూఁడుభేదంబులయ్యె. ఈ సప్తతాళవిధంబులు ముప్పదిమూఁడును నాపంచతాళభేదంబు లిరువదియైదునుఁ గూర్చి లెక్కించిన నన్నియుఁగూడ నేబదియెనిమిది భేదంబులయ్యె. ఏతల్లక్షణంబులును దత్తజ్జాత్యక్షరకాలభేదంబును వేర్వేర బుద్ధిమంతులు తెలియవలయు. ఇట్లుతౌర్యత్రికవ్యవహారయోగ్యంబులై సర్వప్రసిద్ధంబులైన తాళంబులఁగొన్ని యెఱింగించితి. అదియునుఁ గాక తాళదశప్రాణనిరూపణంబే యీకావ్యంబునకుఁ బ్రయోజనంబు గావున నితరతాళభేదంబులకుఁ దల్లక్షణనిరూపణంబొనఁగూర్చిన గ్రంథవిస్తరంబౌననియును నిష్ప్రయోజనంబనియునుఁదలఁచి ప్రతిజ్ఞానుసారంబుగా మొదటఁదాళదశప్రాణనిరూపణంబుఁ గావించి మార్గప్రదర్శనార్థంబుగాఁ గొన్నిప్రసిద్ధతాళంబులకు లక్షణంబుల

వివరించితిఁ గావున మఱియుఁ బ్రసిద్ధాప్రసిద్ధవ్యవహారాస్పదంబు లైన సింహానందనాదితాళాంతరంబుల నేకంబులు కలవు. తల్లక్షణంబులును దత్తజ్జాతీయతాభేదంబులును దత్ప్రతిపాదనగ్రంథాంతరభాషావిశేషంబులవలనఁ దెలిసి తౌర్యత్రికవ్యవహారంబుఁ గావించునెడ నట్టితాళంబుఁ బట్టి వ్యవహరించిన నట్టితాళంబునందుఁ దద్దశప్రాణంబులు గలుగ నిరూపించి తల్లక్ష్యంబునఁ జూచి చెప్పి వ్యవహరించుచు సభారంజనంబుఁ జేయు ధీరోత్తములు మహానటసన్నిభులైన మహానటులని నిర్ణిరోధంబుగా శపథంబుఁ గావించ సమర్థంబగు నదినిజంబు. ఈ విజ్ఞాపనంబు మీదివ్యచిత్తంబున దృఢంబుగా నవధరింపుఁడు.

చం॥ హరిహరిసామ్యభాసురకృపాతిశయాద్భుతధర్మవిక్రమా
హరిహరిసన్నిభాయతమహామహాభాస్వరభోగవైభవా
హరిహరిసత్వసత్వపరిహాసి విభాసిమహాబలోజ్జ్వలా
హరిహరితుర్విరోధితులితాధికదీధితి తథ్యవాఙ్నిధీ. 90

కం॥ మహితాగమప్రచోదిత
విహితప్రథితాత్మ ధర్మవితతాచరణా
పహృతమలీమసతాంచ
ద్దహరోంభోజాతనిహితధరణీశతాంగా. 91

తోదకం॥ అర్జునరోధిరథాపహృదిప్రా
ఘార్జునదానమహావిభవప్రా
ప్తార్జునకీర్తిమహాస్ఫురణాచ్ఛా
ఛార్జునతాతదిగాదిదిగంతా. 92

గద్యము॥ ఇది శ్రీమద్రామభద్రదభద్రాయతకరుణాకటాక్షవీక్షణా
తిశయసంలబ్ధసారస్వతవిచిత్ర పోలూరి రామయామా
త్యపుత్ర సకలసజ్జనవిధేయ గోవిందనామధే
యప్రణీతంబైన తాళదశప్రాణప్రదీ
పికయను మహాభరతకావ్యల
క్షణంబునందు ద్వితీయా
శ్వాసము
సంపూర్ణము.

# తప్పొప్పుల పట్టిక.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు. |
|---|---|---|---|
| 2 | 12 | మెరుగంగ | మెఱుఁగంగ |
| ,, | 19 | దాఁల్చి | దాల్చి |
| ,, | 21 | బంధురాంధ్ర బాషా | బంధురాంధ్ర భాషా |
| ,, | 26 | ప్రభగాంచె | ప్రభఁగాంచె |
| 3 | 10 | భొగ భాగ్య | భోగ భాగ్య |
| 5 | 10 | గలుఁగఁ | గలుగఁ |
| ,, | 18 | సాహాయ్యంబొనరిరప | సాహాయ్యంబొనరింప |
| ,, | 23 | సత్కారంబులఁజేత | సత్కారంబులచేత |
| 7 | 5 | మహేశర | మహేశ్వర |
| ,, | 16 | రాగభేదంబులంజేత | రాగభేదంబులచేత |
| ,, | 17 | శోబిల్లు | శోభిల్లు |
| ,, | 20 | వర్తిల్లుసని | వర్తిల్లునని |
| 8 | 14 | లోకసిద్ధంబు | లోకసిద్ధంబు |
| ,, | 16 | నిశ్చయముఁగాఁగ | నిశ్చయముగాఁగ |
| ,, | 21 | సన్వర్థనామ | నన్వర్థనామ |
| 9 | 9 | సంయోగ | సంయోగ |
| ,, | 18 | నృత్తగీత | నృత్తగీత |
| 10 | 20 | లేఁక | లేక |
| 11 | 19 | నూరు | నూఱు |
| 12 | 6 | లఘవు | లఘువు |
| 13 | 2 | దిటుఁదెల్పెద | రిటుదెల్పెద |
| ,, | 15 | తరములనగు | తరములనఁగ |
| ,, | 20 | దగ్గరనారు | దగ్గరయాఱు |
| 15 | 3 | ఒక్కటియొదట | ఒక్కటిమొదట |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ,, | 10 | నదాశివేంద్ర | సదాశివేంద్ర |
| ,, | 14 | సశబ్దవిలాసము | సశబ్దవిలాసము |
| ,, | 16 | నిష్కామ | నిష్కామ |
| ,, | 20 | సర్వాణి | సర్వాణి |
| ,, | 25 | లాసతీతుకు | లాసతీత్తురు |
| 16 | 5 | ప్రేళ్లెల్ల | ప్రేళ్లెల్ల |
| ,, | 13 | సద్గానపరులు | సద్గానపరులు |
| ,, | 20 | దకారించినను | (1)దకారించినను |
| 17 | 2 | పఱcగ | పరcగ |
| 18 | 2 | ప్లుతములసంగసంగముల్ | ప్లుతములసంగసంగముల్ |
| 20 | 22 | ద్రీర్ఘ | దీర్ఘ |
| 21 | 12 | త్య్రశంబులు | త్ర్యశ్రంబులు |
| 22 | 4 | పెద్దలు | పెద్దలు |
| 24 | 14 | తాళయధాక్షర | తాళయథాక్షర |
| ,, | 16 | తనయధాక్షర | తనయథాక్షర |
| ,, | 21 | యధాక్షర | యథాక్షర |
| 25 | 17 | పదముములుంచి | పదములుంచి |
| 29 | 19 | అశాంత్య | ఆశాంత్య |
| 30 | 8 | దావి | దాని |
| 33 | 23 | యుండు | యుండు |
| 35 | 17 | మహాత్తుకేయ | మహాత్తుకేయc |
| 39 | 5 | ప్రస్తాదంబు | ప్రస్తారంబు |
| 41 | 3 | నిట్టియగంబు | నిట్టియుంగంబు |
| 43 | 22 | గ్రని | గని |
| 44 | 2 | మాత్రకు | మాత్రల |

# తాళదశప్రాణప్రదీపిక.

—:అకారాదిపద్యానుక్రమణిక.—




| పద్యములు. | పుట. |
|---|---|
| అంగపంక్తులక్రింద నమరిన | 29 |
| అంగశ్రేణులుమీఁదట | 28 |
| అంత్యంబువిడిచి | 57 |
| అంత్యమంటక యుపాంత్య | 59 |
| అంత్యమంత్యోపరి | 28 |
| అంత్యముపాంత్యంబు | 57 |
| అంత్యముపాంత్యతుర్యములు | 28 |
| అంత్యోపాంత్యషడర్కముల్ | 55 |
| అక్షరకాలముకంటెను | 12 |
| అక్షరమున నేమన్నను | 22 |
| అగ్రజాతికినల్వంగ | 36 |
| అగ్రజుఁడు వారికెల్ల | 4 |
| అటుఁగాన మొదటి | 13 |
| అట్టితాళంబునందు | 9 |
| అడిగినలెక్క మహత్తులో | 44 |
| అడిగినసంఖ్య మహత్తుసంఖ్యనుడించి | 42 |
| అడిగినసంఖ్య మహత్తుసంఖ్యనుద్రోసి | 45 |
| అడిగినసంఖ్య మహత్తుసంఖ్యలతోన | 41 |
| అడిగినసంఖ్య మహత్తుసంఖ్యలనూడ్చి | 43 |
| అతఁడొక్కనాఁడు | 4 |
| అతనికిఁగల్గిరి యేవురు | 8 |
| అతికించందగుఁ గ్రిందిబంతికి | 55 |
| [illegible] | [illegible] |

| పద్యములు. | పుట. |
| --- | --- |
| అమరఁగమిశ్రజాతిని | 58 |
| అమరఁజతుర్వింశతి | 48 |
| అరయననుద్రుతమేరూపరి | 53 |
| అర్జునరోధరథాపహృది | 65 |
| అర్ధచంద్రమనఁగనవ్యక్త | 18 |
| అర్ధమాత్రమనఁగనావ్యోమ | ,, |
| అర్ధేందుహస్తమునందలి | 16 |
| అష్టక్షణములులవమగు | 11 |
| అహిరాట్ప్రభుజార్గళ | 26 |
| ఆజాతులైదుభూసుర | 21 |
| ఆభరతముబహుభంగుల | 7 |
| ఆయనుద్రుతమేరులందు | 60 |
| ఆయేగురు సత్పుత్రకు | 4 |
| ఆరయమొదటిండ్లైదున, | 54 |
| ఆరెండువిధముల | 14 |
| ఆరైదునాల్గుపంద్రెం | 12 |
| ఆఱయ్యో మొదటిగేహము | 55 |
| ఆఱవదిక్కడక్క | 54 |
| ఆవాపమునిష్క్రామము | 15 |
| ఆశాంత్య మొక్కటి | 29 |
| ఇక్షుగ్రామాన్వయ | 6 |
| ఇటులసర్వద్రుతాంత | 35 |
| ఇతరరూపకాది | 63 |
| ఇరునాలుగువిధములచే | 37 |
| ఈగతిఖండప్రస్తారా | 40 |
| ఈమాడ్కి విప్రజాతి | 52. |

| పద్యములు. | పుట. |
|---|---|
| ఈరీతినెల్లతాళా | 17 |
| ఉత్కటరత్నకాంచన | 26 |
| ఎనిమిదినాలుగుమరి | 12 |
| ఎనిమిదినాల్గురెండును | 13 |
| ఎన్నెన్నియగునుయంత్రము | 37 |
| ఎనఁగనన్నుద్రుతకంటెను | 23 |
| ఏకకళయథాక్షరమగు | ,, |
| ఏజాతిలోనైన | 35 |
| ఐదుగృహంబులుమొదటను | 51 |
| ఒకసశబ్దంబునునొగి | 17 |
| ఒకసారిగీతతాళము | 21 |
| ఒక్కటిమొదటసశబ్దము | 15 |
| ఒగిఁదత్తజ్జాతిలఘు | 20 |
| ఒనరఁగఖండజాతిని | 58 |
| కరతలయుగసంయోగ | 9 |
| కళయనమూఁడువిధంబుల | 23 |
| కాలమార్గక్రియాంగక్రగహ | 11 |
| క్రమమునమార్గములారిటి | 13 |
| ఖండతాళమునఁజక్కఁగ | 44 |
| ఖండప్లుతయంత్రమ్మున | 56 |
| గణితాధారము సర్వలోక | 2 |
| గీతము వెనుకనె తాళము | 20 |
| గురుమేరులేఖనక్రమ | 54 |
| గురుయంత్రంబునుమీఁదిటి | ,, |
| గురుయంత్రమునఁగ్రిందివరున | 50 |
| గురుయంత్రాధఃపంక్తికి | 54 |
| గొప్పయంగంబులాద్యంత | 25 |

| పద్యములు. | పుట. |
|---|---|
| గొప్పయంగములను | 25 |
| గొప్పయంగమైనఁగురుచ | ,, |
| గోమున“తలప్రతిష్ఠా | 8 |
| చతురంగుళప్రమాణము | 19 |
| చతురక్షరకాలాన్విత | 21 |
| చతురశ్రజాతికిఁజక్కఁగా | 27 |
| చతురశ్రజాతిమొదలుగ | 47 |
| చతురశ్రజాతీయ | 36 |
| చతురశ్రతాళసంగతి | 41 |
| చతురశ్రత్ర్యశ్రంబులు | 21 |
| చతురశ్రద్రుతయంత్రము | 53 |
| చతురశ్రద్రుతయంత్రముగతి | 50 |
| చతురశ్రిలఘుగురుప్లుత | ,, |
| చతురశ్రిలఘుమేరుసరణి | ,, |
| చెన్నొప్పఁగమార్గక్రియ | 14 |
| చెలఁగిదక్షిణవార్తిక | 13 |
| జాతిసంఖ్యాక్రమంబున | 30 |
| జాతులకన్నిటికిని | 22 |
| జాతులనేనిటఁబుట్టిన | 19 |
| ఝంపాత్రిపుటలనుద్రుత | 64 |
| తగద్రుతయంత్రమందలి | 48 |
| తగుద్విమాత్రమనఁగ | 19 |
| తత్తజ్జాతిలఘుద్వ్యగు | 20 |
| తత్తన్నామవిశేషము | 14 |
| తనయథాక్షరకాలంబు | 24 |
| తనవా[illegible]రముఁబతాళ | 16 |
| తల్లఘుయుగ్మము | 12 |

| పద్యములు. | పుట. |
|---|---|
| తాళగీతంబులొకటిమై | 21 |
| తాళదశప్రాణంబులు | 5 |
| ,, | 11 |
| ,, | 27 |
| తాళము వెనుక నెగీతము | 20 |
| తాళయథాక్షరకాలము | 24 |
| తాళవేళయందుఁదదను | 19 |
| తీర్థపాదప్రియాతి | 26 |
| తుద మొదళ్లనల్పాంగ | 25 |
| తొమ్మిది మొదటిగ్రహంబుల | 56 |
| తౌర్యత్రికమ త్తేభ | 9 |
| త్ర్యశ్రతాళమునందు | 42 |
| దానసానుద్రుతస్థిత | 23 |
| దొడ్డకొంచంబులన్నట్టి | 26 |
| ద్వికళ హెచ్చించిక్రియతోడ | 23 |
| ద్రుతమధ్యవిలంబము | 24 |
| ద్రుతము మొదలుగాఁగ | 53 |
| ద్రుతమేరూపరిపంక్తుల | 54 |
| ద్రుతయంత్రమహాత్తుల | 48 |
| ద్రుతయంత్రాధఃపక్తికి | 53 |
| ద్రుతలఘువరగురు | 61 |
| ధాతకునిఖిలప్రాణి | 1 |
| ధ్రువమును మఠ్యము | 63 |
| ధ్రువకమ్యాతాళనామ | 15 |
| నారదాదులుగేయవిహారు | 8 |
| నాస్త్యంబరగండునకు | 6 |
| నూరుతమ్మిరేకుల | 11 |

| పద్యములు. | పుట. |
| --- | --- |
| మొదటిల్లొక్కటిఁ వ్రాయుచు | 47 |
| రంజితావాపనిష్కాగ్రిమ | 15 |
| రహిఁకళాద్వయ మొక | 12 |
| రాజముఖ్యచతురుదార | 53 |
| రామునిదశముఖ | 1 |
| లఘుగురుద్రుతములు | 63 |
| లఘుగురుప్లుత మేరు | 52 |
| లఘు మేరునకుఁ గ్రింద | 59 |
| లఘుసమాఖ్యఁ జెల్లు | 19 |
| లలిగురువులు రెండు | 62 |
| లలితషడక్షరాలా | 22 |
| లలితార్ధేందునిభం | 18 |
| లలినద్రుతము | ,, |
| లాలితగురుప్లుతంబుల | 23 |
| వరతౌర్యత్రికలక్షణ | 6 |
| వరలఘు గురుప్లుతంబుల | 48 |
| వరుసఁ బెద్దవిభుండు | 3 |
| వరుసనృత్తగీతవాద్య | 9 |
| వామకరంబుచేతసదర్వ | 16 |
| వారలలోన ముఖ్యుఁడయి | 3 |
| వార్తికమార్గంబువర | 13 |
| వివరించెదవినుము | 49 |
| విశదానుద్రుతమేరువు | 53 |
| విషమసమానాగతములు | 21 |
| వెలయునతీతానాగత | 20 |
| వెనసధఃపంక్తిలో | 49 |
| శారదచంద్రికాశారదశారద | 1 |

| పద్యములు. | పుట. |
|---|---|
| | 47 |
| మొదటిల్లోకట్టి వ్రాయుచు | 15 |
| రంజితావాపనిష్క్రమ | 12 |
| రహికళాద్వయ మొక | 53 |
| రాజముఖ్యచతురుదార | 1 |
| రామునిదశముఖ | 63 |
| లఘుగురుద్రుతములు | 52 |
| లఘుగురుప్లుత మేరు | 59 |
| లఘు మేరునకుఁ గ్రింద | 19 |
| లఘుసమాఖ్యఁ జెల్లు | 62 |
| లలిగురువులు రెండు | 22 |
| లలితపదక్షు కాలా | 18 |
| లలితార్ధేందునిభం | ,, |
| లలినద్రుతము | 23 |
| లాలితగురుప్లుతంబుల | 6 |
| వరతౌర్యత్రికలక్షణ | 48 |
| వరలఘు గురుప్లుతంబుల | 3 |
| వరుసఁ బెద్దవిభుండు | 9 |
| వరుసనృత్తగీతవాద్య | 16 |
| వామకరంబుచేతసదర్ | 3 |
| వారలలోన ముఖ్యుఁడయి | 13 |
| వార్తికమార్గంబువర | 49 |
| వివరించెదవినుము | 53 |
| విశదాద్రుత మేరువు | 21 |
| విషమసమానాగతములు | 20 |
| వెలయునతీతానాగత | 49 |
| వెనవధఃపంక్తిలో | 1 |
| శారదచంద్రికాశారదశారద | |

| పద్యములు. | పుట. |
|---|---|
| శివరూపమగు "త" కారం | 9 |
| శివశక్త్యాత్మకమై పవిత్ర | 10 |
| శుద్ధనాట్యము జేసె | 8 |
| శ్రీకరసదాశివాఖ్య | 3 |
| శ్రీకరసద్గుణవితతికి | 6 |
| శ్రీమద్వామననగర | 11 |
| శ్రీరమణీమృదుచరణాం | 27 |
| శ్రీవాణీరమణీ | 1 |
| శ్రీసదాశివేంద్ర చెప్పిద | 19 |
| శ్రుతిజాతివిశారదులై | 10 |
| సంకీర్ణతాళమెంచఁగ | 45 |
| సంకీర్ణప్లుతగోపురాధర | 60 |
| సతతసవాక్షరకాలా | 22 |
| సన్నిధినున్న నన్ను | 4 |
| సప్తాక్షరకాలాన్విత | 22 |
| సమకోష్ఠంబుమాహాత్మ్యా | 62 |
| సమకోష్ఠవిషమకోష్ఠ | 48 |
| సమయునస్రోతోవహాయన | 25 |
| సరసుఁడు లాస్యదర్శన | 5 |
| సర్వేశ్వరుసియుందు | 2 |
| హరివిభుండను ద్రుతంబున | 18 |
| హరిహరిసామ్యభాసుర | 65 |



*Our forthcoming publications in Telugu:—*

---

1. ఆంధ్రకామందకము.

2. రామాయణము (ద్విపద).

   కట్టా వరదరాజకృతము.

3. (a) రఘునాథనాయకాభ్యుదయము (ద్విపద).

   విజయరాఘవనాయకకృతము.

   (b) రాజగోపాలవిలాసము.

   కాళయవిరచితము.

4. మైరావణచరిత్ర (మంజరీద్విపద).

   కాచనవిరచితము.

5. కుశలవోపాఖ్యానము (ద్విపద).

   రామవార్యకృతము.

6. ద్విపదభాగవతము (దశమస్కంధము).

   మడికి సింగనకృతము.

7. విప్రనారాయణచరిత్ర (యక్షగానము).

   విజయరాఘవనాయకకృతము.

---

***Copies can be had of:—***

**The Honorary Secretary,**

**T. M. S. S. M. Library,**

**TANJORE.**

**(South India.)**

**V. J. P. CHITTOOR.**